# జగన్‌రెడ్డి పాలనలో అన్ని వ్యవస్థలు అస్తవ్యస్తం

### డాక్టర్ చదలవాడ అరవిందబాబు



మాట్లాడుతున్న డాక్టర్ చదలవాడ అరవిందబాబు

**నరసరావుపేట, ఏప్రిల్ 30 (ప్రభ న్యూస్):** జగన్‌రెడ్డి ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పటినుంచి అవినీతి, అక్రమాలు, దుర్మార్గాలు, దౌర్జన్య కాండతో దోచుకొని, దాచుకోవడంలో నిమగ్నమయ్యారని టిడిపి నియోజకవర్గ ఇన్‌ఛార్జి డాక్టర్ చదలవాడ అరవింద బాబు ధ్వజమెత్తారు. ఈ సందర్భంగా డాక్టర్ చదలవాడ మాట్లాడుతూ 2019 ఎన్నికల్లో సింపతీతో గెలవడం కోసం సొంత బాబాయిని అత్యంత కిరాతకంగా హతమార్చారని, వివేకానందరెడ్డి హత్యలో సొంత కుటుంబ సభ్యులు అవినాష్‌రెడ్డి, భాస్కరరెడ్డి ముద్దాయిలుగా ఉన్నారని, ప్రపంచంలో ఎక్కడా ఇలాంటి హత్య జరిగి ఉండదన్నారు. జగన్‌రెడ్డికి పరిపాలన చేతకాదని, అన్న క్యాంటీన్లు, ప్రజా వేదికను కూల్చి వేశారన్నారు. ప్రజా వేదికను కూల్చివేసి 9 కోట్ల ప్రజా ధనాన్ని దుర్వినియోగం చేశారని, ఒక ఆర్థిక నేరగాడు ముఖ్యమంత్రి అయితే ప్రజా ధనం ఇలాగే దుర్వినియోగం అవుతుందని మండిపడ్డారు. ప్రతి వ్యవస్థ జగన్‌రెడ్డి పాలనలో అవస్థ పడుతుందని, ప్రభుత్వ స్కూళ్ళు మూసివేశారని, అమ్మ ఒడిని ఇంట్లో ఒక్క పిల్లవానికే పరిమితం చేసి పేద విద్యార్థులను విద్యకు దూరం చేశారని, జగన్మోహన్‌రెడ్డి విద్యార్థుల పాలిట శకుని మామలాగా తయారయ్యారని దుయ్యబట్టారు. చదువుకున్న విద్యార్థులకు ఉద్యోగం నోటిఫికేషన్ ఇవ్వకుండా నిరుద్యోగులుగా మార్చేశారని, ఆరు లక్షల మంది సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు జగన్‌రెడ్డి చేతగాని పాలనవల్ల నిరుద్యోగులుగా మారారని అన్నారు. వసతి దీవెన సంవత్సరానికి నాలుగు సార్లు వేయాల్సి ఉండగా మూడుసార్లు వేసి ఇంజనీరింగ్ అయిపోయిన పేద విద్యార్థులు సర్టిఫికేట్లు తీసుకోకుండా కాలేజీ యాజమాన్యానికి, విద్యార్థులకు కుమ్ములాట సృష్టించారని అన్నారు. అంబేద్కర్ విదేశీ ఓవర్సీస్ విద్యానిధికి అంబేద్కర్ పేరును తీసివేసి జగనన్న విదేశీ విద్యాదీవెన కానుకగా పేరు మార్చడం అంబేద్కర్‌ను అవమానించడమేనన్నారు. అంబేద్కర్‌కు జగన్‌కు నక్కకు నాగలోకానికి ఉన్నంత తేడా ఉందని, భారత రాజ్యాంగాన్ని నిర్మించిన వ్యక్తి అంబేద్కర్ అని, ప్రజా ధనాన్ని దోచుకొని 16 నెలలు జైల్లో ఉన్న ఆర్థిక నేరగాడు జగన్ పేరు పెట్టడం ఏమిటని ప్రశ్నించారు. రైతు భరోసా కేంద్రాల నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం నిధులు మంజూరు చేసిందని, రాష్ట్ర ప్రభుత్వం కేవలం నియంత్రణ పర్యవేక్షణ మాత్రమే చేసిందని, రైతు భరోసా కేంద్రాలు నిర్మించామని వైసీపీ నేతలు గొప్పలు చెప్పడం సిగ్గుచేటన్నారు. రాష్ట్రంలో 56 లక్షల వృద్ధాప్య, వికలాంగుల, వింతు పెన్షన్లు ఉండగా జగన్‌రెడ్డి అధికారంలోకి వచ్చిన తర్వాత 40 లక్షలకు కుదించి, అధికారంలోకి రాగానే 3వేలు ఇస్తామని చెప్పి ఇవ్వకుండా వృద్ధులను మోసం చేశారని అన్నారు. జగన్‌రెడ్డి పాలనలో ల్యాండ్, శాండ్, మైన్, గుత్కా, గంజాయి, డ్రగ్ మాఫియా చెలరేగి పోతుందనిస మాఫియా కింగ్‌లుగా వైసీపీ నేతలు తయారయ్యారని ఆగ్రహం వ్యక్తం చేశారు. తల్లికి అన్నం పెట్టలేనివాడు పిన్నమ్మకు బంగారు గొలుసు చేస్తానన్నట్లుగా ఒక రాజధాని కట్టడానికి చేతకాని దద్దమ్మ మూడు రాజధానులు అంటూ మూడు ముక్కలాట ఆడుతున్నారని నిప్పులు చెరిగారు. జగన్‌రెడ్డి పాలనలో టిడిపి నాయకులు, కార్యకర్తలు, మహిళలు, దళితులపైన దాడులు పెరిగిపోయాయని అన్ని వర్గాల ప్రజలు వైసీపీ వైరస్‌ను చూసి భయపడుతున్నారని అన్నారు. ఈ సమావేశంలో టిడిపి నాయకులు పాల్గొన్నారు.

## అంకమ్మ, సత్తెమ్మ కొలుపుల్లో ఎమ్మెల్యే నంబూరు



కొలుపుల్లో పాల్గొన్న ఎమ్మెల్యే శంకరరావు

**అమరావతి, ఏప్రిల్ 30 (ప్రభన్యూస్) :** మండ ల పరిధిలోని మునుగోడు గ్రామంలో కొలువై ఉన్న శ్రీ అంకమ్మతల్లి, సత్తెమ్మతల్లి వార్ల కొలుపులు మహోత్సవంలో ఆదివా రం పెదకూరపాడు శాసన సభ్యులు నంబూరు శంకర రావు పాల్గొని ప్రత్యేక పూజలు నిర్వహించారు. ఎమ్మెల్యే నంబూరు శంకర్రావు మాట్లాడుతూ ఆ అమ్మ వార్ల దయవల్ల నియోజకవర్గంలో ప్రజలందరూ సుఖశాంతులతో, ఆయురారోగ్యాలతో, పాడిపంటలతో ఉండాలని అన్నారు. ఈ కార్యక్రమంలో వైయస్సార్ కాంగ్రెస్ పార్టీ నాయకులు గణపా సైదారెడ్డి, కాసు సత్యనారాయణ రెడ్డి, మునుగోడు సొసైటీ అధ్యక్షుడు సింగం పుల్లారెడ్డి, గ్రామ సర్పంచ్ బంకా విష్ణు, గణపా చంద్రశేఖరరెడ్డి కార్యకర్తలు, అభిమానులు,భక్తులు పాల్గొన్నారు.

## ఎస్టీలను గాలికొదిలేసిన వైసీపీ ప్రభుత్వం

### - టీడీపీ ఎస్టీసెల్ జిల్లా ప్రధాన కార్యదర్శి మేడా రామకృష్ణ



మాట్లాడుతున్న రామకృష్ణ

**గుంటూరు అర్బన్, ఏప్రిల్ 30 (ప్రభ న్యూస్) :** వైసీపీ ప్రభుత్వం వచ్చి నాలుగేళ్లు అవుతున్నప్పటికీ రాష్ట్రంలోని గిరిజన కుటుంబాల బ్రతుకులు మారలేదని జిల్లా టిడిపి ఎస్టీ సెల్ ప్రధాన కార్యదర్శి మేడా రామకృష్ణ విమర్శించారు. ఆదివారం తన కార్యాలయం ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశం ఆయన మాట్లాడుతూ ఎస్ టిల అభివృద్ధికి పాటుపడకుండా ప్రశ్నించే వారిపై తప్పుడు కేసులు నమోదు చేసి వైసీపీ ప్రభుత్వం హింసిస్తుందన్నారు. గిరిజనుల సంక్షేమ పథకాలు గాలికి వదిలి,గిరిజన కుటుంబాలను రోడ్ మీదికి వైసీపీ ప్రభుత్వం ఈడ్చిందన్నారు.గిరిజనులకు వ్యవసాయం చేసుకోవడానికి సరైన పెట్టుబడులు, మార్గదర్శకాలు, ఉద్యోగాలు, బ్యాక్ లాగ్ పోస్టులు లేవని విమర్శించారు.గిరిజన ఆడపడుచులకు ఏమి న్యాయం చేసింది ఈ వైసీపీ ప్రభుత్వం అన్నారు. 7 గురు ఎమ్మెల్యే లు ఉన్నా గిరిజనులకు సరైన న్యాయం జరగడం లేదన్నారు.ఎస్ టి కార్పొరేషన్ లు,కమిషన్ ఛైర్మన్ లు,కమిటీ సభ్యులు ఏమి చేయానికాడికి,లక్షల్లో ప్రజాధనాన్ని వృధా చేస్తూ వైసిపి ప్రభుత్వం ఏమి పీకుతుందని రామకృష్ణ ఎద్దేవా చేశారు.

## ఘనంగా వాసవీ కన్యకా పరమేశ్వరి జయంతి



వాసవి చిత్రపటానికి నమస్కరిస్తున్న భక్తులు

**ఈపూరు, ఏప్రిల్ 30 ( ప్రభా న్యూస్) :** మండలంలోని ఈపూరు, ముప్పాళ్ళ గ్రామంలోని అమ్మవారి దేవస్థానంలో జయంతి వేడుకలు ఆదివారం ఘనంగా నిర్వహించారు. అమ్మవారి జయంతి సందర్భంగా దేవాలయాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. వేకవజాము నుంచే అమ్మవారికి ప్రత్యేక పూజలు, అభిషేకాలు నిర్వహించారు. మండల కేంద్రమైన ఈపూరులో శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి అమ్మవారి జయంతి వేడుకలు ఈపూరు ఆర్యవైశ్య సంఘం వారు ఘనంగా నిర్వహించారు. మెయిన్ సెంటర్ లోని అన్నపూర్ణ మెడికల్ స్టోర్ షాప్ ముందు అమ్మవారి చిత్రపటానికి పూలమాలలు వేసి జయంతి వేడుకలు నిర్వహించారు. అనంతరం భక్తులకు అల్పాహారంగా పులిహోర పంపిణీ చేశారు.

## ఆధార్‌తో ఫోన్ నెంబర్ లింక్ తప్పనిసరి



వివరాలు తెలియజేస్తున్న ఎంపీడీవో, సిబ్బంది

**కొల్లిపర, ఏప్రిల్ 30 (ప్రభన్యూస్) :** ప్రజలందరూ దగ్గరలో ఉన్నటువంటి ఆధార్ కేంద్రాల వద్దకు వెళ్లి ఆధార్ అప్డేట్ ఫోన్ నెంబర్ లింక్ ను తప్పనిసరిగా చేయించుకోవాలని అన్నారు మండల పరిధిలోని చివలూరు గ్రామంలో వాలంటీర్లు సచివాలయ సిబ్బందితో కలసి ప్రతి ఇంటి వద్దకు వెళ్లి సిటిజన్ ఔట్రిచ్ ప్రోగ్రాంలో పాల్గొన్నారు. ఎంపీడీవో పి శ్రీనివాసులు మాట్లాడుతూ సచివాలయ సిబ్బంది వాలంటీర్లు కలిసి సమన్వయంతో సిటిజన్ ఔట్రిచ్ ప్రోగ్రాంలో ప్రజలందరికీ సచివాలయం ద్వారా అందించే సేవలను తెలియజేయాలని అన్నారు ఆధార్ అప్డేట్ ను ప్రతి ఒక్కరు చేయించుకోవాలని వెల్లడించారు.

## ఘనంగా కృష్ణవేణి కళాశాల వార్షికోత్సవం



ముఖ్యఅతిథి తులసి రామచంద్రప్రభును సన్మానిస్తున్న కళాశాల డైరెక్టర్లు

**నరసరావుపేట అర్బన్, ఏప్రిల్ 30 (ప్రభ న్యూస్) :** కృష్ణవేణి డిగ్రీ కళాశాల 18వ వార్షికోత్సవాన్ని కళాశాల ఆవరణలో శనివారం ఘనంగా నిర్వహించినట్లు కళాశాల ప్రిన్సిపాల్ నాతాని వెంకటేశ్వర్లు తెలిపారు. ఈ సందర్భంగా ప్రిన్సిపాల్ మాట్లాడుతూ ప్రతి విద్యార్థి క్రమశిక్షణతో సమయానుకూలంగా పనిచేయడం వల్ల ఉన్నత శిఖరాలకు చేరుకోవచ్చన్నారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన తులసి గ్రూప్ సంస్థల అధినేత తులసి రామచంద్రప్రభు మాట్లాడుతూ ప్రతి విద్యార్థి డిగ్రీతో పాటు తగిన నాలెడ్జ్‌ను, నైపుణ్యాలను పెంపొందించుకోవాలని సూచించారు. విభిన్న రంగాల్లో భారత దేశాన్ని ప్రథమ స్థానంలో నిలిపే బాధ్యత నేటి యువతపై ఉందన్నారు. ఆర్థికంగా, సైనికపరంగా ఇతర దేశాలను అధిగమించి ఒక బలమైన శక్తిగా భారత దేశాన్ని నిర్మించాలని తెలిపారు. దేశమంటే మట్టికాదోయ్-దేశమంటే మనుషులోయ్ అనే గురజాడ గీతాన్ని గుర్తు చేశారు. ఈ విద్యాసంవత్సరంలో కళాశాలలో విప్రో, టిసియస్ పలు కంపెనీల్లో ఉద్యోగాలు సాధించిన విద్యార్థులకు, విద్యలో ప్రతిభ కనబర్చిన విద్యార్థులను, క్రీడల్లో పతకాలు సాధించిన విద్యార్థులను ప్రత్యేకంగా అభినందించి బహుమతులు అందజేశారు. సాంస్కృతిక కార్యక్రమాలతో విద్యార్థులు అలరించారు. ఈ కార్యక్రమంలో కళాశాల డైరెక్టర్ నాసరయ్య, అధ్యాపకులు, విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్నారు.

## నేడు వైసీపీ ప్రాంతీయ కార్యాలయంలో 'మేడే'



మాట్లాడుతున్న జిల్లా వైసీపీ అధ్యక్షుడు డొక్కా మాణిక్యవరప్రసాద్

**గుంటూరు ఈస్ట్,ఏప్రిల్ 30 (ప్రభన్యూస్) :** అంతర్జాతీయ కార్మిక దినోత్సవం (మేడే) సందర్భంగా సోమవారం ఉదయం 9:00 గంటలకు గుంటూరు నగరంలోని బృందావన్ గార్డెన్స్ 6వ లైన్ క్యాపిటల్ హోటల్ ఎదురు గా వున్న వైసిపి ప్రాంతీయ కార్యాలయంలో మేడే వేడుకలను ఘనంగా నిర్వహిస్తున్నట్లు మాజీమంత్రి , జిల్లా వైసిపి అధ్యక్షులు డొక్కా మాణిక్యవరప్రసాద్ తెలిపారు. ఆదివారం బృందావన్ గార్డెన్స్‌లోని వైసిపి కార్యాలయంలో విలేకర్ల సమావేశం ఏర్పాటు చేశారు. జిల్లా వైసిపి అధ్యక్షులు డొక్కా మాణిక్యవరప్రసాద్ మాట్లాడుతూ మేడే వేడుకలకు ముఖ్య అతిథులుగా రాజ్యసభ సభ్యులు ఆళ్ల అయోధ్య రామిరెడ్డి , రీజినల్ కోఆర్డినేటర్, ఎమ్మెల్సీ మర్రి రాజశేఖర్ , ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు ,నగర మేయర్ , డిప్యూటీ మేయర్లు, కార్పొరేషన్ ఛైర్మన్లు, డైరెక్టర్లు హాజరు అవుతారని తెలిపారు.గుంటూరు జిల్లా వైయస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ట్రేడ్ యూనియన్ వారి ఆధ్వర్యంలో జెండా ఆవిష్కరణ , కేక్ కటింగ్ కార్యక్రమం నిర్వహిస్తున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో జిల్లా అనుబంధ విభాగాల అధ్యక్షులు, కార్పొరేటర్లు, కో-ఆప్షన్ సభ్యులు, ఏఎంసి ఛైర్మన్లు , డైరెక్టర్ లు జడ్పిటిసిలు, ఎంపీపీలు, ఎంపీటీసీలు, సర్పంచులు, జెసిఎస్ కన్వీనర్లు పార్టీ ముఖ్య నాయకులు, కార్యకర్తలు, అభిమానులు, కార్మిక సంఘాల నాయకులు, ఇతర ప్రజాప్రతినిధులు, మాజీ ప్రజాప్రతినిధులు, గృహసారధులు అందరూ పాల్గొని మేడే వేడుకలను జయప్రదం చేయవలసిందిగా కోరారు.

## పల్నాటి సంఘ సంస్కర్తకు ఘన నివాళి



గురువులు చిత్రపటానికి నివాళులర్పిస్తున్న వాసవి క్లబ్ బృందం

**మాచర్ల,ఏప్రిల్ 30(ప్రభన్యూస్):** పల్నాటి సంఘసంస్కర్త పందిరి గురువులకు వాసవి క్లబ్ ఆధ్వర్యంలో ఆదివారం ఘన నివాళులు అర్పించారు. మాచర్ల పట్టణంలోని గ్రంథాలయంలో గురువులు 59వ వర్ధంతి వేడుకలను ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా ప్రముఖ కవి, రచయిత డా. బెజ్జంకి జగన్నాథచార్యులు మాట్లాడుతూ కుల మత రహిత సమాజం కోసం ఉద్యమించటమే కాకుండా, ఆచరించి చూపించిన మహనీయుడు పందిరి గురువులని ఆయన అన్నారు. పందిరి గురువులు చిత్రపటానికి డాక్టర్ బెజ్జంకి, మాచర్ల మున్సిపల్ వైస్ ఛైర్మన్ పోలూరి నరసింహారావు, చరిత్రకారుడు, రచయిత పావులూరి సతీష్‌బాబు, వాసవి క్లబ్ అధ్యక్షులు ఓరుగంటి చెన్నకేశవరావు, గురువులు కుమారుడు అంబర్ తదితరులు పూలమాలలు వేసి ఘననివాళులు అర్పించారు. డాక్టర్ బెజ్జంకి మాట్లాడుతూ సాంఘికసమానత్వ సాధనకు పలు విప్లవాత్మక కార్యక్రమాలు చేశారని, ఆచార్య వినోబా భావే తో కలసి భూదానోద్యమంలో పాల్గొన్నారన్నారు. మున్సిపల్ వైస్ ఛైర్మన్ పోలూరి నరసింహారావు మాట్లాడుతూ గురువులు స్వగ్రామమైన తుమృకోటలో దళితులకు ఆలయ ప్రవేశం కల్పించి, అన్ని కులాలవారికి సహపంక్తి భోజనాలు పెట్టించిన మహానుబావుడని, గ్రామంలో స్కూల్ ఏర్పాటుకు, అనేక గ్రామాల్లో గ్రంథాలయాలు ఏర్పాటుకు తీవ్రంగా కృషి చేశారన్నారు. వాసవి క్లబ్ ఛైర్మన్ ఓరుగంటి చెన్నకేశవరావు మాట్లాడుతూ స్వాతంత్ర్య ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్న గురువులు పల్నాడు ప్రాంతంలో అంబర్ చరఖా ప్రవేశపెట్టడంలో ప్రముఖ పాత్ర వహించారని అందుకు గుర్తుగా వారి కుమారుడికి అంబర్ అని పేరు పెట్టుకున్నారన్నారు. పావులూరి సతీష్‌బాబు మాట్లాడుతూ ప్రముఖ హేతువాది, సంఘసంస్కర్త గోరా సతీమణి సరస్వతి గోరా, లవణం తో కలసి అనేక ఉద్యమాల్లో గురువులు పాల్గొన్నారని, అస్పృశ్యత నిర్మూలన, సమసమాజమే లక్ష్యంగా తుదిశ్వాస వరకు పనిచేశారన్నారు. పందరి బాలగురవయ్య మాట్లాడుతూ గురువులు చరిత్ర ఎవరికి తెలియదని వెలుగులోకి తీసుకువచ్చిన పావులూరి సతీష్‌బాబును ప్రత్యేకంగా అభినందిం చారు. ఈసందర్భంగా సతీష్‌బాబును శాలువాతో సన్మానించారు. ఈ కార్యక్రమంలో మేడం నాగేశ్వరరావు, పోలా శ్రీనివాసరావు, ఉప్పుతోళ్ళ రమేష్, చుండూరి సత్యనారాయణ, పందిరి నరసింహారావు, బొచ్చు రాజా, లాల్‌సాహెబ్ తదితరులు పాల్గొన్నారు.